భాగ్యజననీ సౌభాగ్యవర్ధినీ- కించ-తస్యాస్తు స్త్రియాః కరగ్రహే వివాహే మాంగ ల్యసూత్రం మంగళసూత్రవచ్ఛుభదాభవంతి॥ అ॥ నాలుగుశ్లోకములచే నాడీకూ టమును జెప్పుచున్నాడు॥ తా॥ చతుష్పాదనక్షత్రములయందు బుట్టిన స్త్రీకి అశ్వి న్యాదిగ మూడుప్రేళ్లయందును-కృపునడుత్తరవి- ఉపాపూభా ఈత్రిపాన్నక్ష త్ర ములయందు బుట్టిన స్త్రీకి। కృత్తిక మొదలు నాలుగుప్రేళ్లయందున్న (న్య) చిత్ర, శత ద్విపాన్నక్షత్రములయందు బుట్టిన స్త్రీకి మృగశిర మొదలైన ప్రేళ్లయందున్న లె క్కింపగా గన్యయొజన్మనక్షత్రము। వరునిజన్మనక్షత్రమున్న। వేలియందు లేక । ఒక్కటి యొక ప్రేలియందున్న। శుభకరంబగుటయుగాక స్త్రీకి మంగళసూత్రముంబోలె మిక్కిలి సౌభాగ్యప్రదంబగుననుట॥ ❊

( ౧౦౮ ) మూ॥ శ్రేణిత్రయ్యథవా ప్రభావిగణయేద్భాన్యశ్విమాద్వ్యత్యయా న్మాధ్యంపత్యోః ప్రజన్మభేశుభఫలేధిష్ణ్యాంగుళిస్థేయది। పార్శ్వైకాంగుళిసంస్థి తం యది విఘూంహాంత్యేవధిష్ణ్యద్వయం తన్మధ్యాంగుళిసంస్థితం యది పతింహాం త్యేవపాణిగ్రహే॥ వ్యా॥ అ॥ పద్యాంతరేణ నాడీకూటమాహ॥ శ్రేణిత్రయి। శ్రేణి శ్రేణయాని నక్షత్రాణి ప్రభాత్ । వ్యత్యయాన్మాచ్చగణయేత్ । దంపత్యోః జన్మనక్షత్రే భిన్నాంగుళిస్థే యది తదా శుభఫలప్రదే ఇత్యర్థః। ధిష్ణ్యద్వయం దంపత్యోర్జన్మనక్షత్రద్వయం పార్శ్వైకాంగుళిసంస్థితం పార్శ్వయోరేకాంగుళ్యాం సంస్థితం యది తదా పాణిగ్రహే వధూం హంతి। ధిష్ణ్యద్వయం మధ్యాంగుళిసంస్థితం యది తదా ప తింవరం హంతి॥ అ॥ నాడీకూటము నింకొకవిధంబున జెప్పుచున్నాడు॥ తా॥ అశ్వి ని మొదలుమూడేసినక్షత్రములు మూడుప్రేళ్ళయందు క్రమవ్యత్యయముగా చేగ ణనచేయగా వధూవరుల నక్షత్రములొక్కప్రేలియందుండక వేరువడియున్న శుభక రంబులగుననియు నిరువురునక్షత్రములు ఒకప్రేలియందున్న మిక్కిలి యాపత్క రంబగుననియు ముఖ్యాభిప్రాయము॥ ❊

( ౧౦౯ ) మూ॥ పర్యాయైస్త్రిభిరేవ్యదివ్యవహితం స్త్రీభంచపుంస్త్వ యం పార్శ్వైకాంగుళిసంస్థితం యది తదా తద్రాశికూటేశుభే। సద్రజ్జ్వావరయో ర్నియోగసమయే హ్యేకాధిపత్యే ద్వయోర్నైష్ట్ర్యదే కేచిదత్ర నాడీజనదోషస్తునే త్యాచిరేవ్యా॥ అ॥ పార్శ్వైకాంగుళిదోషాపవాదమాహ॥ పర్యాయైరితి। స్త్రీ భం స్త్రీజన్మర్క్షం। పుంభం పుంజన్మర్క్షం చేతి ద్వయం వధూవరజన్మనక్షత్రద్వయం త్రిత యైపర్యాయైః త్రిభిరావృత్తిభిః వ్యవహితమంతరితం సత్। పార్శ్వైకాంగుళి సంస్థితం వా। అథవా తదా వివాహసమయే। తద్రాశికూటే దంపత్యోః రాశికూటే శుభే వాయదిఅథవా నియోగసమయే వివాహకాలే వరాచవరశ్చవరౌ ❊ స్త్రీపుమాం స్త్రీ చేత్యేకశేషః। తయోః స్త్రీపుంసోః రజ్జుకూటే శుభే వా యదీత్యర్థః। ద్వయోః దంపతీ

జన్మరాశ్యోరేకాధిపత్యే ద్వయోరేక ఏవాధిపతిశ్చేదిత్యర్థః। అథవా। ద్వయోర్నక్షత్రేందపతిరాశ్యధిపత్యోర్మిత్రత్వే చ యది। తదా। ఏకనాడీజనితదోషః ఏకాంగుళీజన్యదోషః। నాస్తీతి కేచిదార్యాః ఊచిరే జగుః। వచేర్లిట్॥ అ॥ దంపతులజన్మనక్షత్రములొకవ్రేలికి వచ్చినను దోషములేకయున్నదని విధమును జెప్పుచున్నాడు॥ తా॥ పూర్వశ్లోకమున జెప్పబడిన క్రమంబున దంపతులజన్మనక్షత్రములు అశ్వనిమొదలుముమ్మారుగణన చేయునపుడొకవ్రేలిని బొందకయుండియు పిమ్మట నొకవ్రేలిని బొందియున్నను। దంపతుల రాశికూటగ్రహకూటములు శుభకరములై యున్నను। ఉభయులజన్మరాసులకొక గ్రహము అధిపతియైయున్నను। జన్మరాశ్యధిపతులు పరస్పరమిత్రత్వముగలవారైయున్నట్టి సమయమున నేకాంగుళిస్థితనక్షత్రదోషము లేదని కొందఱి యభిప్రాయము॥ ☼

( ౧౧౦ ) మూ॥ ఇంద్రాగ్నివసుమిత్రపూషసవితృస్వాతీశివాజైకపాద్భేష్వేవాష్టసు దంపతీజననభే ద్వే హ్యేకధిష్ణ్యే శుభే। అంత్యోపాంత్యవిధిద్విదైవగిరిశశ్రీశార్యపిత్ర్యేషు వా నానాపాదజయోర్యమేందువరుణబ్రధ్నాహ్యసార్పేషు వా॥ వ్యా॥ అ॥ నాడీకూటముక్త్వా ఇదానీమవస్థాభేదేన తద్భంగమాహ॥ ఇంద్రాగ్నీ ఇతి॥ ఇంద్రాగ్నివసుమిత్ర పూషసవితృస్వాతీ శివాజైకపాదః విశాఖాధనిష్ఠానూరాధారేవతీ హస్తస్వాత్యార్ద్రాపూర్వాభాద్రాః ఏతేసు భేషు। అష్టసు నక్షత్రేషు వా। ఏకనాడీదోషో నాస్తి। అథవా। ఏతేష్వష్టస్వేవ నక్షత్రేషు ద్వే దంపతీజననభే దంపతీజన్మనక్షత్రే । ఏకధిష్ణ్యే సమానపాదగతే వా శుభే శుభకరే భవతః కుతస్తల్లభ్యత ఇతి చేత్ । నానాపాదజయోరిత్యుత్తరార్ధే వక్ష్యమాణత్వాత్ అత్రేదం ప్రతిభాతి ధనిష్ఠానూరాధే మధ్యాంగుళిస్థితే అపి శుభే అన్యాని పార్శ్వైకాంగుళి సంస్థితాని శుభానీతి కించ అంత్యోపాంత్యవిధిద్విదైవగిరిశశ్రీశార్యపిత్ర్యేషు రేవత్యుత్తరాభాద్రారోహిణీ విశాఖార్ద్రాశ్రవణపుష్యమఘాసు । యమేందువరుణబ్రధ్నాహ్యసార్పేషు భరణీమృగశీర్షశతభిషగ్ఘస్తపూర్వాషాఢాశ్లేషాసు షట్సు చ । నానాపాదయోః భిన్నపాదసంభూతయోర్వా। ఏకనాడీదోషో నాస్తి ఉత్తరాభాద్రాపుష్యభరణీమృగశీర్షపూర్వాషాఢాపంచకం మధ్యనాడీ స్థితమపి భిన్నపాదగతం చేచ్ఛుభావహం । అన్యాని నవ పార్శ్వస్థితాని భిన్నపాదగతాని శుభాని । ఉక్తాతిరిక్తాశ్వినీపునర్వసూపూర్వాఫల్గున్యుత్తరఫల్గునీచిత్రాజ్యేష్ఠా మూలోత్తరాషాఢానాం మధ్యే మధ్యే ఏకనాడీస్థితే చిత్రాఫల్గున్యౌ అన్యాని పార్శ్వస్థితాని చ । సర్వదా నింద్యాని అత్ర రేవతీవిశాఖాదార్ద్రాహస్తానాం పునర్గ్రహణం భిన్నపాదవిషయత్వార్థం॥ అ॥ ఏకాంగుళిస్థితనక్షత్రజన్యదోషమునకు విధ్యంతరముచేత బరిహారమును జెప్పుచు

న్నాడు॥ తా॥ దంపతులు-ధ-అనూ-స్వా-పూభా ఈనక్షత్రములయందైనను ఈ నక్షత్రములలో నొకనక్షత్రంబున నొకపాదమునందైనను- ఉభా- రో- శ్ర- పుష్యా। ము। భ। మృ। శ। పూషా। ఆశ్లే ఈనక్షత్రములభిన్నపాదములయందైనను। రే। వి। ఆర్ద్ర। హ। యీనక్షత్రములయందైనను। యీనక్షత్రములభిన్నసమానపాదములయందైనను జన్మించియుండిరేని యేకాంగ్రిస్థితనక్షత్రదోషము లేదు॥

(౧౧౧) మూ॥ జ్ఞేయాన్యంఘ్రిచతుష్టయానిసకలాన్యశ్విన్యాదిదస్రాదితో ష్వేకైకస్యనవాంఘ్రికం ప్రతిగృహం జ్ఞేయంచ మేషాదితః। రాశ్యంతం గణయేద్వరస్యతుసదా స్త్రీజన్మరాశ్యాదితః ప్రోక్తాద్దోషనిరూపణే ప్రథమతో మేషాదిరాశీశ్వరాః॥ వ్యా॥ అ॥ అథత్రిభిః శ్లోకైః రాశికూటమాహ॥ జ్ఞేయానీతి అస్రాదితః అశ్విన్యాదీని। సకలానిబుధాని। అంఘ్రిచతుష్టయాని పాదచతుష్టయయుక్తానిజ్ఞేయాని॥ పాదః పదంఘ్రిశ్చరణోస్త్రియామిత్యమరః। మేషాదితః మేషాదిద్వాదశరాశీనామేకైకస్యరాశేః। ప్రతిగృహం నవాంఘ్రికం నవపాదాత్మకం జ్ఞేయం జ్ఞాతవ్యం తత్రసదాసర్వదా స్త్రీజన్మరాశ్యాదితః వధూరాశిమారభ్యవరస్యరాశ్యంతం గణయేత్ దోషనిరూపణే ఏకవింశతి మహాదోషనిరూపణసమయే ప్రథమత ఏవ। మేషాదిరాశీశ్వరాః ప్రోక్తాః భౌమశ్శుక్ర ఇత్యాదినా ఉక్తాః। కిమర్థమేతన్నిరూపితమితిచేత్। వక్ష్యమాణశ్లోకే మిత్రత్వే గ్రహయోరిమావితి రాశ్యధిపతిత్వస్యాకాంక్షితత్వాత్॥ అ॥ మూడుశ్లోకములచేత రాశికూటమును జెప్పుచున్నాడు॥ తా॥ ఒకొకనక్షత్రమునకు। నాలుగుపాదములు అట్టిపాదములు తొమ్మిది చేరిననొకరాశియగును। రాశికూటాదివిచారము జేయునపుడు కన్యయజన్మరాశి మొదలు వరునిజన్మరాశివరకు లెక్కింపవలయునని తాత్పర్యము॥ *

(౧౧౨) మూ॥ దంపత్యోస్సమసప్తమౌ చ సుతదౌ తావేకరాశిస్తయోర్ముఖ్యౌ త్రిభవౌ చతుర్థదశమౌ తద్వ్యత్యయో వాశుభౌ। ఉద్వాహేనవపంచమౌత్వశుభదౌ తద్వ్యత్యయావాశుభౌ మిత్రత్వే గ్రహయోరిమావపిశుభావేకాధిపత్యేపివా॥ వ్యా॥ అ॥ గణనాయాః ఫలమాహ॥ దంపత్యోరితి॥ దంపత్యోః జాయాచపతిశ్చదంపతీతయోర్వధూవరయోః రాశీ। సమసప్తమౌ చేతి సుతదౌ పుత్రప్రదౌ। స్త్రీరాశిమారభ్య పురుషరాశిపర్యంతం గణనాయాం క్రియమాణాయాం రాశీనాం సప్తసంఖ్యా చేత్సమసప్తకం భవతి। తయోర్దంపత్యోః రాశిరేకరాశిశ్చేత్తావపిముఖ్యౌ ఉత్తమౌ కేవలత్రిభవౌ స్త్రీరాశిమారభ్య పురుషరాశిపర్యంతం పునః పురుషరాశిమారభ్య స్త్రీరాశిపర్యంతం చ గణనాయాం సత్యాం తృతీయైకాదశౌ। తద్వత్ చతుర్థదశమౌ చ తద్వ్యత్యయౌ తావేకాదశమచతుర్థౌ చేత్ శుభౌ అన్యథా అశుభౌ ఉద్వాహమయే నవపంచమౌతు అశుభౌ। తద్వ్యత్యయాపం

సర్గికశత్రుసమస్తాత్కాలికమిత్రంచేత్సోపిసమోభవతి, నైసర్గికసమస్తాత్కాలికశత్రుశ్చేత్సోపిశత్రురేవ, తాత్కాలికసమత్వాభావాత్, తథాచోక్తంబృహజ్జాతకే॥ శ్లో॥ అన్యోన్యస్యధనవ్యయాయసహజవ్యాపారబంధుస్థితాస్తత్కాలేసుహృదస్స్వతుంగభవనేప్యేకేరయస్త్వన్యథా। ద్వ్యేకానుక్తభపాంస్సుహృత్సమరిపూన్సంచింత్యనైసర్గికాంస్తత్కాలేచపునస్తుతానధిసుహృన్మిత్రాదిభిఃకల్పయేదితి॥ అ॥ రెండుశ్లోకములచేతగ్రహమైత్రిద్వైవిధ్యము వర్ణించుచున్నాడు॥ తా॥ సూర్యునకికుజగురుచంద్రులుమిత్రులుశత్రువులు। బుధుడుసముడు। శత్రుశూన్యుండైనచంద్రునికిరవిబుధులుమిత్రులు। కుజగురుశుక్రశనులుసములు।కుజునికిరవిగురుచంద్రులుమిత్రులు। బుధుడుశత్రువుశనిశుక్రులుసములు। బుధునికిరవిశుక్రులుమిత్రులుచంద్రుడుశత్రువుకుజశనిగురువులుసములు।గురువునకుకుజచంద్రసూర్యులుమిత్రులు।బుధశుక్రులుశత్రువులు।శనిసముండు।శుక్రునకు।శనిబుధులుమిత్రులు। సూర్యచంద్రులుశత్రువులుగురుకుజులుసములు।శనైశ్చరునకు।బుధశుక్రులుమిత్రులు।కుజరవిసోములుశత్రువులు।గురుడుసముడు। ఈచెప్పబడినశత్రుమిత్రత్వములుస్వభావసిద్ధంబులైయుండుగాక ఆయాకాలములయందుసంభవించుశత్రుమిత్రత్వములెవ్వియనిన।గ్రహమునకు౨।౩।౪।౧౦।౧౧।౧౨। ఈస్థానములయందున్నగ్రహములుతాత్కాలికమిత్రములు౧।౫।౬।౭।౮।౯ ఈస్థానములయందున్నగ్రహములుతాత్కాలిక శత్రువులు నైసర్గికమిత్రగ్రహముతాత్కాలికమిత్రమైయున్నఅధిమిత్రమగును।నైసర్గికశత్రువుతాత్కాలికశత్రువైనఅధిశత్రువగును। నైసర్గికశత్రువుతాత్కాలికమిత్రుండైనసముండగు నైసర్గికమిత్రుండు తాత్కాలికశత్రువైన సముండగు నైసర్గికసముడుతాత్కాలికశత్రువైనశత్రుండగును నిర్ణయింపవలయును శత్రుమిత్రనిర్ణయమునకుప్రయోజనంబేమియనిన వధూవరులజన్మరాశ్యధిపతులకుమైత్రిత్వముగలిగియున్ననునేకాధిపత్యముగలిగియున్నశుభకరంబగును। సమత్వముగలిగియున్నసామాన్యఫలంబులుగలుగును । శత్రుత్వముగలిగియున్నదంపతులకుమృత్యుకరంబగుననుట॥

( ౧౧౬ ) మూ॥ భావాంయోనిరియంతుదస్రవరుణాశ్వోయమాం
త్త్యాదౌమృగస్సార్పస్సంజాతసింహధిధూమ్యాశ్వానౌతుమూలేశ్వరౌ। మార్జాలా
[illegible] హిష్బద్వ్యమురుదక్ భేతుమ
[illegible] మైత్రభేసు హస్తౌ తోయాచ్య
[illegible] ఖ్యాజపాద్వసూఫణేపూర్వాభిజిత్స్వాక్రమాత్। శ్వై
రంబహుధిపరీస్పృసంహారిగజం శాఖాస్పృగాజంభవేద్గంపత్యోరపివైరమశ్వమ

హిషంగోవ్యాఘ్రిమోత్వాఖుచ॥ వ్యా॥ అ॥ అథద్వాభ్యాం యోనికూటమాహ॥ భానామితి॥ వ్యాఘ్ర్యాపతిచ॥ దస్రవరుణావశ్వినీశతభిషజౌ।అశ్వౌతురగాయమాంత్యౌభరణీరేవత్యౌ । గజౌపుష్యాగ్నిభేపుష్యకృత్తికే। సుచజౌచ్ఛాగౌవిధివిధూరోహిణీమృగశీర్షేఅహీసర్పౌమూలేశ్వరౌమూలార్ద్రే ॥ శ్వానౌశునకౌ।ఉరగాదితి।అశ్లేషాపునర్వసూ॥మార్జారౌ। పితృభగౌమఘాపూర్వఫల్గున్యౌఆఖుమూషకౌ। అర్యమాహిర్బుధ్న్యౌ । ఉత్తరఫల్గున్యుత్తరాభాద్రే।పశూగావౌ। మరుదర్కభేస్వాతీహస్తౌమహిషౌ । ఇంద్రాగ్నిచిత్రాఖ్యభే।విశాఖచిత్రానక్షత్రేవ్యాఘ్రౌశార్దూలౌ । శక్రభమైత్రభేతు। జ్యేష్ఠానూరాధేతు- హరిణౌమృగౌ,తోయాచ్యుతౌ, పూర్వాషాఢాశ్రవణేమర్కటౌకపీ, అజపాద్వసూపూర్వాభాద్రాధనిష్ఠే, సింహాఖ్యౌ, విశ్వాభిజిద్భేఉత్తరాషాఢాభిజన్నక్షత్రే।ఫణరిపూఫణీనాం సర్పాణాంరిపూశత్రూజఘూప్రిక్రమాదుక్తక్రమాత్,బోధ్యః॥ తేషాంవైరయోనిమాహ॥శైణ్వాణమితిశైణ్వాణంశ్వాశునకఏణఃకృష్ణమృగః,తయోస్సమాహారః,శైణ్వాణంమేషాంచవిరోధశ్శ్వశ్వేతకఇత్యేకవద్భావస్సర్వత్రనపుంసకమితినపుంసకత్వంబభ్రుసరీసృపంబభ్రుర్నకులః, సరీసృపస్సర్పశ్చతయోస్సమాహారఃబభ్రుసరీసృపం-హరిగజంసింహగజం,శాఖామృగాజం, మర్కటచ్ఛాగం, అశ్వమహిషం, గోవ్యాఘ్రం,ఓత్వాఖుమార్జారమూషకం॥ని॥ ఓతుర్బిడాలోమార్జారఇత్యమరః,ఏతేషాంయథావైరంతథాతత్సంజ్ఞికనక్షత్రజాతయోర్దంపత్యోరపివైరంభవేత్, మూలానక్షత్రేజాతస్సశ్వా అనూరాధాయాంజాతాసా ఏణీభవతి॥ ఉభయోర్వైరంవిరోధః ఏవమన్యేష్వపిద్రష్టవ్యం, ఇయమేవ - భానాంయోనిః, యోనికూటకూటఇత్యుచ్యతే, ఉక్తరీత్యాయయోర్నక్షయోర్నక్షత్రవిరోధఃతన్నక్షత్రజాతయోరేవదాంపత్యంయుక్తమిత్యభిప్రాయః॥ అ॥ రెండుశ్లోకములచేతయోనికూటమును జెప్పుచున్నాడు ॥ తా ॥ అశ్విని శతభిషఙ్నక్షత్రములు గుఱ్ఱములు భరణీరేవతులేనుంగులు, పుష్యకృత్తికలజములు.రోహిణీ । మృగశీర్షములుసర్పములు మూలార్ద్రలుకుకరలు। ఆశ్రేషపున। పిల్లులు। మఖ। పుబ్బ। కొకురలుఉత్తర।ఉషా। గోవులు। స్వాతి। హస్తలెనుబోతులు।విశాఖ।చిత్త। పులులు। జ్యేష్ఠ। అనూరాధమృగములు। పూషా।శ్రవ। కోతులు। పూభా।ధని। సింహములు। అషా।అభిజి। ముగిసలు। యీరీతినక్షత్రములకు సంజ్ఞల నెఱుంగవలయునిందు బరస్పరవైరముగలజంతువులెవ్వియనినశునకహరిణంబులు। పాముముంగిసలు। గజసింహములు। కపిఛాగంబులు। అశ్వమహిష బులుగోవ్యాఘ్రములు। ఇవిచిరకాలవైరములుగలవైయుండు గావున నిపరమస్పరవిరోధిజంతుసంజ్ఞగల నక్షత్రములయందుబుట్టిన స్త్రీపురుషులకు

దాంపత్యముఘటించిన ముక్తిప్రకారంబగుని చెప్పబడినక్రమంబునపరస్ప
రవిరోధముబులేకయుండెడి నక్షత్రములయందుబుట్టిన స్త్రీపురుషులకుదాం
పత్యముగయోగ్యంబగుననితాత్పర్యము॥ ❀

(౧౧౮) మూ॥ యస్యాస్త్రీపురుషస్యభంచయువతేర్ధిష్ణ్యంతుయ
స్యాంత్యభం పుంధిష్ణ్యే ప్రభవశ్శుభశ్చపురుషః స్త్రీధిష్ణ్యజాస్త్రీశుభా। స్త్రీ
ధిష్ణ్యే ప్రభవావుభావపిశుభౌ పాణిగ్రహే ద్వేషదౌతౌద్వౌవాపురుషర్క్షజౌ
యదివాస్వన్యోన్యయోనిర్ద్వ్యపా॥ వ్యా॥ అ॥ అథయోనికూటస్యఫలాంతరమాహ॥ యస్యా
యస్యాస్త్రీయుతే॥ యస్యాద్యంయస్యా। పూర్వోక్తక్రమేణ భావిసంజ్ఞితే
ద్వయేఆద్యంప్రథమం। భంనక్షత్రంపురుషస్యపురుషసంబంధినక్షత్రం యువతేర్ధి
ష్ణ్యం స్త్రీనక్షత్రంతు। యస్యాంత్యభంయస్యాఅంత్యనక్షత్రమిత్యాదిసర్వం యు
థా। అశ్వినీశతభిషక్త్యస్యాద్యమశ్వినీనక్షత్రపురుషసంబంధి। యస్యాంత్యభం
శతభిషక్। స్త్రీనక్షత్రమేవంసర్వత్రయోజ్యం ఏతస్యఫలంచదర్శయతి పుంధిష్ణ్య
ప్రభవః। పురుషనక్షత్రజాతః। పురుషశ్శుభః స్త్రీధిష్ణ్యజా స్త్రీనక్షత్రజాతా స్త్రీ
శుభా అథవా ఉభావపి స్త్రీపురుషావపి। స్త్రీధిష్ణ్యప్రభవౌ స్త్రీధిష్ణ్యజాతౌ
యది। పాణిగ్రహే వివాహవిషయే శుభాశుభప్రదౌ। తౌద్వౌ స్త్రీపురుషౌ పురు
షర్క్షజౌ యదివా అథవా స్వన్యోన్యయోనిర్ద్వ్యపౌ। పురుషనక్షత్రజా స్త్రీ। స్త్రీనక్షత్ర
జాతశ్చేద్వాయది। ద్వేషదౌ కలహప్రదౌ॥ తా॥ భానాంయోనిరియంతు అనుశ్లో
కమును జెప్పబడియున్న యశ్వినీశతతారలు మొదలగు నక్షత్రములజంటలలో
మొదటినక్షత్రముపురుషనక్షత్రము రెండవది స్త్రీనక్షత్రముఅని। సంజ్ఞలందుబు
రుషనక్షత్రమునబుట్టినవరుడును స్త్రీనక్షత్రమునబుట్టినకన్యయు వివాహవిష
యమైశుభకరంలగుదురు స్త్రీనక్షత్రమునబుట్టినదంపతులును శుభకరులగుదు
రుఉభయులుపురుషనక్షత్రమునబుట్టినవారైయున్నను కన్యకాపురుషనక్షత్రం
బునబుట్టినదైయుండినపురుషుడు స్త్రీనక్షత్రమునబుట్టినవాడైయున్నను నిత్య
కలహముగలుగుచుండును॥ ❀

(౧౧౯) మూ॥ స్త్రీభాద్యంరభాంతమేవగణయేత్ స్త్రీదూరమా
ద్యేయదిద్వేషంమధ్యఫలం ద్వితీయనవకే దద్యాత్తృతీయేసుఖమ్। స్త్రీధిష్ణ్యా
యథాత్రయోదశ పరం పుంజన్మధిష్ణ్యం భవేదేవంవా బహుపుత్రకృత్గణరి
యేనోచేత్తయోర్వైరకృత్॥ వ్యా॥ అ॥ క్రమప్రాప్తం స్త్రీదూరకూటమాహ॥
స్త్రీభాద్యమితి ॥ స్త్రీభాద్యం స్త్రీనక్షత్రమారభ్యవరభాంతంపురుషనక్షత్ర
పర్యంతమేవగణయేత్ ఏవకారేణనతూక్తవైపరీత్యేనేత్యర్థః। ఏవంగణనా
యాంక్రియమాణాయాం ఆద్యేప్రథమనవకే పుంనక్షత్రంవిద్యతేయది। తదా
స్త్రీదూరం స్త్రీదూరకూటం। ద్వేషందంపత్యోః కలహందద్యాత్। ద్వితీయ

త్రేణమానుషగణంహిత్వాసురాణాంగణం చాన్యంశోభనమామనంతిమునయః కేచిత్తుపాణిగ్రహే॥ వ్యా॥పూర్వోక్తగణానాంఫలమాహ॥ దంపత్యోరితి॥పరిణయేవివాహవిషయేదంపత్యోః॥ స్వగణః, స్వకీయగణః, ఉభయోరేకగణఇత్యర్థః శుభః మర్త్యామరణాంమనుష్యదేవానాంగణః ఏకస్యమనుష్యగణఃఅన్యస్య రాక్షసగణశ్చేత్ మధ్యమః అమరరక్షసాంగణః ఏకస్యదేవగణః అన్యస్యరాక్షసగణశ్చేత్ అశుభకృత్ మర్త్యాసురాణాంగణః ఏకస్యమనుష్యగణః,అన్యస్యరాక్షసగణశ్చేత్ మృతిర్మరణంభవేత్ దైవజ్ఞ్యత్రేణసహమనుష్యగణంహిత్వా విహాయరాక్షసగణేన అమరగణంచహిత్వాఅన్యం మనుష్యదేవగణం పాణిగ్రహేవివాహవిషయేశుభకరమితికేచిన్మునయః ఆమనంతివదంతి హిత్వాద్దైత్యగణేన మానుషగణంహిత్వాసురాణాంగణమిత్యత్రవిశేషః కేవలదేవాసురగణస్యమనుష్యగణస్యవాననిషేధః । కింతుస్త్రియారాక్షసగణః। పురుషస్యదేవగణోవామానుషగణోవాయదిదోషప్రదః । అన్యథాపురుషస్యరాక్షసగణఃస్త్రియాదేవగణోమనుష్యగణోవాయదిశుభప్రదః॥ శ్లో॥ స్త్రీరాక్షసంనకర్తవ్యం కర్తవ్యంనరరాక్షసమ్ । స్త్రీరాక్షసంభవేన్మృత్యుస్స్యాదేవనసంశయఇత్యుక్తత్వాత్॥ అ॥పూర్వశ్లోకమున జెప్పబడినగణములకు ఫలముజెప్పుచున్నాడు॥ తా॥ దంపతులగణమొకటిన్నైయున్న శుభకరంబగునుమనుష్యదేవగణములు మధ్యమంబులగును గొందఱిపక్షంబుననివియు శుభకరంబులగును దేవరాక్షసగణములశుభకరంబులగును మనుష్యరాక్షసగణములు మృత్యుప్రదంబులగును వ్యాఖ్యానమున వ్రాయబడియున్న గ్రంథాంతరవచనమువలనపురుషునిదిరాక్షసగణమైయున్నను యోగ్యంబగుననుట॥ ※

(౧౨౨)మూ॥ స్త్రీభాద్యంవరభాంతమేవగణయేన్మాహేంద్రవర్గాస్త్వమీవేద్యస్సప్తమదిక్త్రయోదశ రసటోణేసిధిటోణయ । దృక్షేత్రేశరలోచనేపరిణయేహ్యాష్టాసుపుత్రప్రదాదంపత్యోరితరేనదాకలహదావర్గేషుముఖ్యాస్త్వయమ్॥ వా॥ అ॥ అథమాహేంద్రవర్గమాహ॥ స్త్రీభాద్యమితి॥ స్త్రీభాద్యంవధూనక్షత్రమారభ్య । పరభాంతంవరనక్షత్రపర్యంతమేవ గణయేత్ । ఏవకారఃవరనక్షత్రమారభ్యవధూనక్షత్రాంతగణనాయోగ్యవ్యవచ్ఛేదార్థకః। ఏవంగణనాయాంక్రియమాణాయాంసత్యాంవేదఃచతుర్థనక్షత్ర। సప్తమదిక్త్రయోదశరసటోణేసిధిటోణయః । సప్తమనక్షత్రందిగ్దశమనక్షత్రం త్రయోదశనక్షత్రం రసాష్షట్ టోణేరేకః వామాంకప్రక్షేపేణమిళిత్వాషోడశవామాం కప్రక్షేపేణైవోత్తర త్రసంఖ్యాగ్రహణంకార్యం నిధియోనవ । టోణేరేకఃమిళిత్వాఏకోనవింశతిః దృక్షేత్రేద్వావేకవింశతిః శర

లోచనే పంచవింశతిః అష్టాష్టావర్గాణాం మాహేంద్రవర్గాః దంపత్యోస్సుపుత్రప్రదాః ఇతరే డక్కారికాఖ్యా వర్గాః కలహప్రదాః - అయంవర్గః - పరిణయే వివాహవిషయే వర్గేషు ముఖ్యః శ్రేష్ఠః। అ॥ మాహేంద్రవర్గువును జెప్పుచున్నాడు॥ తా॥ వధూనక్షత్రము మొదలు ౪-౭ ౧౦-౧౩-౧౬-౧౯-౨౨-౨౫-ఈ నక్షత్రములు మాహేంద్రవర్గములనంబడుఁగాననీ- క్షత్రములలో నొకటివరనక్షత్రమైయున్న వివాహవిషయమైయుత్తమంబగునీమాహేంద్రవర్గు శుభకరంబగునటుగాకున్న గలహకరంబగునని తాత్పర్యము॥ ❋

(౧౨౩) మూ॥ స్త్రీభాదేత్వరధిష్ణ్యయుక్తగణనాసంగుణ్యతాంసప్తభిర్హృష్టావింశతిసంఖ్యయా పగణయేద్భక్త్వైవపుంభాద్యది। తద్వత్తాంగణనాంచ భాగకరణం త్వాయుష్యవర్గస్త్వయం యచ్ఛేషేనధికేపుమైవమరణంతస్యైవమధ్యేతయోః॥ వ్యా॥ అ॥ గణితాగతాయుష్యవర్గమాహ॥ స్త్రీభాదేరితి॥ పరిణయే వివాహవిషయే స్త్రీభాదేః స్త్రీనక్షత్రప్రభృతి- వరధిష్ణ్యయుక్తగణనా వరనక్షత్రాంతే నాభిజిత్సహితేనయుక్తగణనాయాం తాంగణనాంసప్తభిస్సప్తసంఖ్యయా- సంగుణ్య అష్టావింశతిసంఖ్యయా భక్త్వా విభజ్య। శేషమేవనిక్షిపేత్ -లబ్ధేన ప్రయోజనాభావాత్। పుంభాద్యపి పునః పుంనక్షత్రమారభ్య। స్త్రీనక్షత్రాంతయుక్తగణనాయాం। తాంచగణనాం భాగకరణంవిభాగక్రియాంచ। తద్వత్ పూర్వవత్సప్తభిస్సంగుణ్య అష్టావింశతిసంఖ్యయా విభజ్య శేషంనిక్షిపేత్। ఏవంసతి। యచ్ఛేషే। యస్య పురుషస్య సంబంధిని శేషే అనధికే స్త్రీశేషాన్న్యూనే సతి। తయోర్దంపత్యోర్మధ్యే తస్యైవ పురా ప్రథమతః మరణం। స్త్రీశేషే అనధికే సతి। స్త్రియాః ప్రథమతో మరణమితి వేదితవ్యం। అయమేవాయుష్యవర్గ ఇత్యుచ్యతే। ఉభయోశ్శేషాసమాయదిదంపత్యోర్మరణం। యుగపదిత్యర్థాల్లభ్యతే॥ అ॥ గణితాగతాయుష్యవర్గువును జెప్పుచున్నాడు॥ తా॥ కన్యాజన్మనక్షత్రము మొదలు వరజన్మనక్షత్రమువరకు గణనచేసి యా సంఖ్యను ౭టిచే గుణించి ౨౮ చేత భాగింపగా శేషించిన సంఖ్యనట్లుంచి మరల వరనక్షత్రము మొదలు కన్యానక్షత్రమువరకు గణనచేసి యా సంఖ్యను బూర్వమువలె గుణించి భాగింపగా శేషించిన సంఖ్యముందు శేషింయున్న సంఖ్యకంటెనధికముగనుండనేని పురుషునికంటె ముందువనితకాలముసేయును। సంఖ్యాద్వయము సమంబగు శేషించియుండనేని యుభయులకు సమకాలమున మరణము సిద్ధించునని తాత్పర్యము॥ ❋

(౧౨౪) మూ॥ ఆయాస్స్వర్ధ్వజధూమసింహశునకాఖుక్షౌ ఖరాఖ్యోగజః కాకోష్టావితిచైకమేకమశుదుతత్పాద్రిగాదీదస్రాద్యపి। శిష్టంభత్రితయంభవేత్స

రిణయేస్వస్యాయధిష్ణ్యదత సత్త్వంచమభంతయోః కలహాకృత్స్యాదాయ
వర్గస్స్వయమ్॥ వ్యా॥అ॥ఆయవర్గమాహ॥ఆయాఇతి॥ధ్వజధూమ సింహశునకాఃఉ
క్షా ఖరాఖ్యాః।గజః। కాకః।ఇత్యష్టౌప్రాగాద్యాయాస్స్యుః దప్రాదిఅశ్విన్యాది।ప
క్షైకముడునక్షత్రంతత్ప్రాగాదతేషాంధ్వజాద్యాయానాంప్రాగాది। పునఃపునః
త్రివారంగణయేత్ తథాచత్రిరావృత్త్యాచతుర్వింశతినక్షత్రాణిభవంతిశేషంత్రి
రావృత్త్యాశిష్టంభత్రితయంనక్షత్ర త్రితయంస్వస్యాయధిష్ణ్యాదితః ధ్వజధూమ
సింహాయస్థితనక్షత్రాదితఃపునర్భవేత్ ।అయమర్థః । ప్రాచ్యాంధ్వజాయేఅశ్వి
న్యాశ్లేషానూరాధాపూర్వాభాద్రాః।ఆగ్నేయ్యాంధూమాయేభరణీమఘాజ్యే
ష్ఠోత్తరాభాద్రాఃదక్షిణస్యాంసింహాయేకృత్తికా పేర్వఫల్గు మూలా రేవత్యః
నైరృత్యాంశునకాయేరోహిణ్యుత్తర ఫల్గునిపూర్వాషాఢా ప్రతీచ్యాంవృష
భాయేమృగశీర్ష హస్తోత్తరాషాఢాఃవాయవ్యాఖరాయేఆర్ద్రా చిత్రాశ్రవణాని
ఉదీచ్యాంగజాయేపునర్వసూస్వాతీధనిష్టాఃఈశాన్యాంకాకాయేపుష్యవిశాఖా
శతభిషజః । భవంతిపరిణయేవివాహేతత్త్వంచమభంయస్మిన్నాయేపున్నక్ష
త్రంతత్పంచమాయస్త్రీనక్షత్రంవిద్యతేచేత్ తయోర్ద్వంపత్యోఃకలహకృద్భవేత్
ధ్వజాయేఅశ్వినీపురుషభంతత్పంచమేవృషభాయేతత్పంచమంస్త్రీ నక్షత్రంమృగ
శీర్షంయదితయోః। సరస్పరంపంచమవర్గో భవతితయోఃపరస్పరవిరుద్ధత్వాద్దం
పత్యోఃకలహకృదితిభావః।విరోధవిచారస్తువాస్తుగ్రంథతరణేవక్ష్యమాణత్వాత్ ఇ
హావిస్తరభయాన్నలిఖ్యతే।అయమేవాయవర్గ ఇత్యుచ్యతే॥ అ॥ ఆయవర్గము జెప్ప
చున్నాడ॥ తా॥తూర్పుమొదలగుదిక్కులయందు క్రమంబున ధ్వజధూమ సింహ।
శునక।వృషభ।ఖర।గజ।కాకాయములగుచున్నవిఅష్టవిధాయములలోధ్వజాయ
ముమొదలు ।అశ్విన్యాదికముగా౨౭నక్షత్రములమువ్మారుగణనచేయగా శే
షించినమూడునక్షత్రములనుధ్వజాద్యాయత్రయమునగణనచేయవలయునిట్లు
గణనచేయుగావచ్చినినక్షత్రమున్నఆయమునకు। ౫వ ఆయమునవరనక్షత్రమున
కు।౫వదగునన్నియనక్షత్రమున్నగలహాకరంబగునని తాత్పర్యము॥ ✻

( ౧౨౫ ) మూ॥ కన్యాకుంభతులాధనుర్ధ్నరయుజాంత్యక్త్వామృగం
కరుటంసింహంచైవఝషం వివాహసమయే వశ్యాశ్చశేషాగృహాః । త్యక్త్వా
వశికమేవసర్వ నిలమాస్సింహస్య పశ్యాస్తథాజ్ఞాతవ్యా అపితౌళికాశ్చభక
రావశ్యాఖ్యయోగాస్త్వమీ॥ వ్యా॥ అథవశ్యవర్గమాహ॥ కన్యేతి॥ కన్యాకుంభ
తులాధనుర్ధ్నరయుజాం ఆద్యాస్త్రయః ప్రసిద్ధాః ధనుర్ధ్నరయుక్ ధనుషః ప
రార్థఇత్యర్థః ధనుషః పూర్వార్థఅశ్వాకారః । ఉత్తరార్థో నరాకారఇతిప్రసి
ద్ధేః। తేషాంచతుర్ణాంక్రమేణమృగం । కరుటంసింహంఝషంచవివాహసమ

మే-త్యక్త్వా శేషాః గృహాః రాశయః సర్వేషాం వశ్యాః-ఏవం సర్వత్రాపూర్వ్యాం సింహస్య వృశ్చిక మేవ వృశ్చిక మాత్రం త్యక్త్వా సర్వేషాం యోః సర్వరాశయః వశ్యా ఇతిజ్ఞాతవ్యాః। అమీవశ్యాఖ్యయోగాః శుభకరాః తౌళికాయోగా అపిశుభకరాః తౌళికాయోగవిచారస్తు దైవజ్ఞవిలాసేస్పష్టః విస్తరభయాన్నేహాలిఖ్యతే॥ అ॥ వశ్యవగుణము జెప్పుచున్నాడు॥ తా॥ వివాహకాలమునందు కన్యారాశికిమకరరాశిని కుంభరాశికి కర్కటరాశిని తులారాశికి సింహరాశిని । ధనురుత్తరార్ధమునకు మీనరాశిని సింహమునకు వృశ్చికరాశిని బరిత్యజించి తక్కిన సకలరాసులు । సకలరాసులకును వశ్యంబులనంబడు గాన నీవశ్యయోగంబులును దైవజ్ఞవిలాసమను గ్రంథమునవిశదంబుగ జెప్పబడియున్న తౌళికాయోగంబులును వివాహవిషయమై శుభకరంబులగుననుట॥ *

( ౧౨౬ ) మూ॥ పర్యాయత్రితయేనవోడుషుదూర్ధిష్ణ్యాదిశస్తత్ఫలం మృత్యుప్రీతివిపత్సుఖాతిఁపశుకృద్రోగప్రజాకృన్మిత్రద్విట్ । పుంభాంతంగణయే తయోః పరిణయే వర్గోదినాఖ్యస్త్వయం పుంభాదిజగణ పత్యోర్వాథఫలం పూర్వోక్తమత్రాపిచ॥ వ్యా॥ అ॥ అథదినకూటమాహ॥ పర్యాయేతి॥ ఉదూర్ధిష్ణ్యాదితః వధూనక్షత్రమారభ్య పుంభాంతం పురుషనక్షత్రాంతం గణయేత్ । ఏవం గణనాయాం సత్యాం పర్యాయత్రితయే త్రిషుపర్యాయేషు నవోడుషు । నవసు తేషు నవనక్షత్రాణామిత్యర్థః క్రమాత్ మృత్యుః। ప్రీతిః। విపత్ సుఖం ఆర్తిః। పశుకృత్ రోగకృత్ । ప్రజాకృత్ । అమిత్రకృత్ । శత్రుకృత్ । ఇత్యేతత్ఫలం తయోర్దంపత్యోర్భవతి। పరిణయే వివాహసమయె అయమేవ దినాఖ్యావర్గః దినకూటః పతుపుంభాది పురుషనక్షత్రమారభ్య వధూనక్షత్రాంతం గణయేత్। ఫలంతు । అత్రాపి అస్మిన్పక్షేపి పూర్వోక్తమేవేతి జగుః॥ అ॥ దినకూటమును జెప్పుచున్నాడు॥ తా॥ వధూనక్షత్రము మొదలు వరనక్షత్రమువరకు లెన్నగా వరనక్షత్రము మొదటిదైయున్న మృత్యువు-౨ దైన ముదము ౩ వదైన బెడదర వదైన సుఖము ౫ వదైన మనఃపీడ ౬ వదైన పశులాభము ౭ వదైన రోగములు ౮ వదైన సంతానము ౯ వదైన శాత్రవప్రాప్తియుంగలుగును। మరల ౧౦ వదైన మృత్యువు ౧౧ వదైన ముదమిరీతిగా లెక్కచేసిన నక్షత్రములకు మున్నాడు నీ ఫలంబులనిర్ణయింపవలయు గొందఱు వరనక్షత్రాదిగనెన్నవలయునని యీఫలనిర్ణయమును జెప్పియున్నవారు తెలంగేసనియాను డః పరి॥

( ౧౨౭ ) మూ॥ విప్రామీనకుళీరవృశ్చికగృహాస్సింహాజచాపాః కృపావేశ్యా గోమృగకన్యకాఘటతులా యుగ్మాలయాఃశూద్రజాః। దంపత్యోస్సుభ దైకజాతిరశుభా శ్రేష్ఠాతుజాతిస్త్రియాహీనా చేదథమధ్యమా పరిణయే పుంజాతిరాశేస్తయోః॥ వ్యా॥ అ॥ అథద్వాభ్యాంశ్లోకాభ్యాంజాతివర్గమాహ॥ విప్రా

ఇతి॥ మీకుళీరవృశ్చికగృహాః త్రయో రాశయో పప్రాః విప్రజాతయః సింహాజజాపాస్సింహమేషధనూంషి క్షత్రియోనృపాః క్షత్రియజాతయః గోమృగకన్యకాః వృషభమకరకన్యాః వైశ్యజాతయః తేషాంఫలమాహ - దంపత్యోరేకజాతిశ్చేచ్ఛుభదా పుంజాతిరాశేః పురుషరాశ్యపేక్షయా స్త్రీరాశేర్జాతిః శ్రేష్ఠా చేదశుభాసమా స్యాత్ - స్త్రీజాతిః పుంజాతేరూన్యా చేన్మధ్యమా తత యోర్దంపత్యోః మధ్యమఫలదా స్త్రీరాశిః బ్రాహ్మణజాతిః పుంరాశిః క్షత్రియాదిజాతిశ్చేదశుభా॥ పుంరాశి బ్రాహ్మణజాతిః స్త్రీరాశిః క్షత్రియాదిరాతిశ్చేన్మధ్యమేతిఫలితోర్థః॥ అ॥ రెండుశ్లోకములచేత జాతివర్గమును జెప్పుచున్నాడు॥ తా॥ మీనకర్కాటవృశ్చికరాసులుబ్రాహ్మణవర్ణములు- సింహ- మేష- ధనుపులు క్షత్రియవర్ణములు- వృషభమకరకన్యకలు వైశ్యవర్ణములు- కుంభతులామిథునములు శూద్రవర్ణములు ఇందుకుఫలం బేమియనిన దంపతుల రాసులొకవర్ణముగలవైయున్న శుభకరంబులగును - వధూరాశి వరరాశికంటెను త్తమవర్ణముగలదయియున్న నశుభకరంబగును హీనవర్ణముగలదయియున్న మధ్యమఫలంబగునని తాత్పర్యము॥

(౧౨౮) మూ॥ విప్రక్షత్రవిశశ్చతుర్థకులజాయే పంచమాస్సంకరాష్షష్ఠాష్షశ్చేభవర్ణజా భువిజనా విప్రాదిదస్రాదితః। శిష్టంభత్రితయంత్వజాంఘ్రిభముఖం త్రైవర్ణికానాం భవేదృక్షాణామపి రాశిజాతిఫలవద్వర్ణాఖ్య వర్గ స్త్వయమ్॥ వ్యా॥ విప్రేతి॥ విప్రక్షత్రవిశః బ్రాహ్మణక్షత్రియవైశ్యాః- చతుర్థకులజా శూద్రాశ్చ పంచమాశ్చ- సంకరాః షష్ఠాశ్చ యే జనాః- తేష ధవర్ణాః భువిమానాలోకే ప్రసిద్ధాః - దస్రాదితః అశ్విన్యాద్యార్ద్రాంతానాం షణ్ణాంక్రమేణ- విప్రాదిబ్రాహ్మణాదివర్ణా భవంతి - ఏవం పునః పునః గణయేత్తు ఏవం చతురావృత్త్యా చతుర్వింశతి నక్షత్రాణి భవంతి- అజాంఘ్రిభముఖం- పూర్వాభాద్రాదికం - శిష్టంభత్రయం నక్షత్రత్రయం - త్రైవర్ణికానాం బ్రహ్మక్షత్రవిశాంక్రమేణ భవేత్తు- ఏతదుక్తం భవతి - అశ్వనిపునర్వసూహస్తమూలాపూర్వాభాద్రాణాం బ్రాహ్మణవర్ణః - భరణిపుష్యచిత్రాపూర్వాషాఢోత్తరాభాద్రాణాం క్షత్రియవర్ణః కృత్తికాశ్లేషాస్వాత్యుత్తరాషాఢా రేవతీనాం వైశ్యవర్ణః రోహిణీమఘావిశాఖాశ్రవణానాం శూద్రజాతిః- మృగశీర్షపూర్వఫల్గున్యనూరాధాధనిష్ఠానాం పంచమజాతిః- ఆర్ద్రోత్తరాజ్యేష్ఠాశతభిషజాం సంకరజాతిరితి- ఋక్షాణాం జాతేః ఫలం- రాశిజాతిఫలవత్తుద్రష్టవ్యం- దంపత్యోర్నక్షత్రజాతిరేకాచేచ్ఛుభకరా - శ్రేష్ఠా స్త్రీ చేదశుభాన్యూనా చేన్మధ్యమా అయమేవవర్ణాఖ్యవర్గ ఇత్యుచ్యతే॥ అ॥ నక్షత్రజాతి వర్గమును జెప్పుచున్నాడు॥ తా॥ పుడమియందు బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రపంచమసంకరం

మాత్రేషాంబాణరసర్తుమార్గణాశరాదప్రాదితాత్స్యాద్యపి । దంపత్యోరపి
జన్మభేపరిణమేయద్యేకపక్షిస్థితే ప్రీతిస్స్యాత్కలహంఖగద్వయగతే చేత్పక్షిప
గాస్త్వయం॥ వ్యా॥ అ॥ పక్షివర్గమాహ॥ తార్క్ష్య ఇతి॥ తార్క్ష్యో గరుడః గరుత్మా
న్గరుడవస్తార్క్ష్య ఇత్యమరః - పింగళః పక్షివిశేషః కాకో వాయసః కుక్కుటః ప్రసి
ద్ధః బర్హిణః మయూరః॥ ని॥ మయూరో బర్హిణో బర్హీ ఇత్యమరః - ఇత్యేతే పంచ
ఖగాః పక్షిణో జ్ఞేయాః తేషాం పంచఖగానాం సంబంధిద్రాక్ష్ణాం పంచఖగా
అధిపతయ ఇత్యర్థః - బాణ అశ్విన్యాది పంచకస్య - తార్క్ష్యః రసః ౬ ఆర్ద్రాదిషట్క
స్యపింగళః - ఋతుః ఉత్తరాదిషట్కస్య కాకః మార్గణాః జ్యేష్ఠాదిపంచకస్య
కుక్కుటః శరః ధనిష్ఠాదిపంచకస్య బర్హీ అధిపతిః - ఏవంచ సతి దంపత్యోః జనన భే
జన్మనక్షత్రే ఏకపక్షిస్థితే యది ప్రీతః దంపత్యోరన్యోన్యం ప్రీతిస్స్యాత్ - ఖగద్వ
గతే పక్షిద్వయగతే యది కలహస్స్యాత్ - అయమేవ పక్షివర్గ ఇత్యుచ్యతే॥
అ॥ పక్షివర్గమును జెప్పుచున్నాడు॥ తా॥ అశ్విని మొదలు ౫ నక్షత్రములకు గరుడప
క్షియు ఆర్ద్ర మొదలు ౬ నక్షత్రము పింగళమనియు - ఉత్తర మొదలు ౬ నక్షత్ర
ములకు కాకము జ్యేష్ఠాదిపంచకమునకు కోడియు - ధనిష్ఠ మొదలు ౫ నక్షత్రము
లకు నెమలియు నధిపతులగుటవలన - నీయాధిపత్యములలో వివాహవిషయమై
వధూవరుల జన్మనక్షత్రముల - కొకపక్షియధిపతియైయున్న - దంపతుకొకరి
యందొకరికి ప్రీతి గలిగియుండును- ※

(౧౩౧) మూ॥ లింగానిత్రయాని తానీవిలిఖేద్రేఖాశ్చతస్రో గతాస్తి
ర్యక్తత్రహలింగరజ్జురితి తద్వాయవ్యకోణాదితః । తత్రాపి క్రమశః ప్రదక్షిణ
విధౌ తిర్యగ్ద్విరేకాంగతు దంపత్యోర్యదిజన్మభేపరిణయేస్యాత్తాంస్తు వైరప్రదే॥
వ్యా॥ అ॥ అథరజ్జువర్గమాహ॥ లింగానీతి॥ త్రితయానిలింగానిత్రీణిలింగాకా
రాణితానిప్రసిద్ధానిపవిలిఖేత్ । తత్రలింగాకారరేఖాత్రవతమే - తిర్యగ్గతాశ్చత
స్రో రేఖావిలిఖేత్ - తతస్తద్వాయవ్యకోణాదితి - వాయవ్యకోణమారభ్యేతి
యావత్ - ప్రదక్షిణవిధౌ ప్రదక్షిణక్రమేణేత్యర్థః - దస్రాదిక్రమశః అశ్విన్యా
దిక్రమాత్సప్తవింశతినక్షత్రాణి చవిలిఖ్యేత్తు - ఏవం విలిఖితేసతి దంపత్యోర్జన్మ
భే జన్మనక్షత్రే కృత్తికాణి - తిర్యద్విరేఖాంగతే ప్రాప్తే యదిస్తు వైరగ పరిదేదంప
త్యోః పరస్పరం అత్యంతకలహ ప్రదేస్స్యాత్తాంపరిణయే అయమేవలింగరజ్జు
రిత్యుచ్యతే॥ అ॥ రజ్జువర్గమును జెప్పుచున్నాడు॥ తా॥ నిడుపుగ మూడు లింగాకా
ర రేఖలు వ్రాసియా రేఖలమీద నాలుగడ్డగీటులు గీచియందు వాయవ్యకోణము
మొదలు ప్రదక్షిణక్రమముగ నశ్విని మొదలు ౨౭ నక్షత్రములునుంచగా నదువధు
దూవరుల జన్మ నక్షత్రములా యడ్డగీట్లలో నొక రేఖయందున్న నపుడు దంపతుల

ధ్యా॥ అ॥పూర్వశ్లోకమందు జెప్పంబడినయిష్టశక్తులకుప్రయోజనమును జెప్పచున్నాడు.॥ తా॥తూర్పుదిక్కు మొదలష్టదిక్కులకునశ్విని మొదలొక్కొక్కదిక్కునకొక్కొక్కనక్షత్రమువరుసనక్రమముగ౨౭నక్షత్రములుసంపూర్ణముగవరకనువిభజింపగావధూవరులజన్మనక్షత్రము లొకశక్తిసంబంధముగలైయున్నపరస్పరమైత్రికరంబగునట్లు గాకున్నగలహకరమగునని తాత్పర్యము॥ ✻

(౧౩౪)మూ॥ విశ్వాశ్లేషరతత్త్వయోదకవసుస్థాణ్వంత్యశక్రాంతకత్వష్ట్రాదిత్రితయాభిధాఃపరిణయేస్త్రీలింగతారాస్త్వమాః । తారాస్యుశ్చనపుంసకాశ్శతభిషఙ్మాలేందవశ్చామరాః పుంతారాస్త్వశుభాన్యలింగజనితాప్రీతిస్వలింగర్క్షజా॥ వ్యా॥అ॥అథలింగవర్గమాహ॥విశ్వేతి॥విశ్వేఉత్తరాషాఢాఅశ్లేషాచతుష్టయంఆశ్లేషామఘాపూర్వాఫల్గున్యుత్తరఫల్గునః ఉదకంపూర్వాషాఢా-వసుః-ధనిష్ఠా-స్థాణుః-ఆర్ద్రా।అంత్యోరేవతీ-శక్రః-జ్యేష్ఠా-అంతకోభరణీత్వష్ట్రాదిత్రయం-చిత్రా స్వాతీవిశాఖాః- ఇమాశ్చతుర్దశస్త్రీలింగతారాః-శతభిషఙ్మాలేందవః-శతభిషఙ్మూలమృగశీర్షాణినపుంసకతారాస్యుఃఅవరాః క్తావశిష్టాఃఅశ్వినీకృత్తికారోహిణీపునర్వసూపుష్యహస్తానూరాధాశ్రవణపూర్వాభాద్రోత్తరాభాద్రాదశపుంలింగతారాస్స్యుః అన్యలింగజనితాతారాఅశుభాస్వలింగర్క్షజాప్రీతిశ్శుభకరేత్యర్థః-దంపత్యోర్జన్మనక్షత్రద్వయంఏకలింగంచేచ్ఛుభంభిన్నలింగంచేదశుభమితి వేద్యం॥ అ॥లింగవర్గమును జెప్పచున్నాడు॥ తా॥ఉషా-ఆశ్లే-మ-పుబ్బ-ఉత్తర-పూషాఢా-ఆర్ద్రా-రే-జ్యే-భ-చి-స్వా-వి- ఈ౧౪నక్షత్రములుస్త్రీలింగములు- శ-మూ- మృ-ఈ౩నక్షత్రములు-నపుంసకలింగములుతక్కిననక్షత్రములు- పుంలింగములు- ఈలింగనిర్ణయమునకుఫలమేమనినదంపతులజన్మనక్షత్రములొకలింగముగలవైయున్నపరస్పరప్రీతికరంబగునట్లు గాకున్నగలహకరంబగునని తాత్పర్యము॥ ✻

( ౧౩౫ ) మూ॥ భూవార్యగ్నిమరున్నభాంసిచమహాభూతానిపంచక్రమాత్తేషాంబాణరసర్తుమార్గణశరాదస్రాదిభామ్యాద్యపి । ఏకస్యోడుజభేవేదపరభంవహ్న్యాభవచ్చేత్తరయోర్మృత్యుస్స్యాదపరేశుభాఃపరిణయే భూతాఖ్యవర్గస్త్వయమ్॥ వ్యా॥ అ॥ అథభూతవర్గమాహ॥భూవారీతి॥భూః పృథివివాఃజలంఅగ్నిఃతేజః మరుత్ వాయుః-నభః- ఆకాశః- ఏతాఃపంచమహాభూతానిభవంతి - భూమ్యాదిపృథివ్యాదీనాందస్రాది అశ్వినీప్రభృతిక్రమాత్ బాణరసర్తుమార్గణశరాఃఆయుష్యగ్ధఃపృథివ్యాఃబాణఃఅశ్విన్యాదిపంచకం - జలస్యరసాఆర్ద్రాదిషట్కం- అగ్నేః ఋతవః ఉత్తరఫల్గున్యాదిషట్కం- మరుతః, మార్గణః- జ్యేష్ఠాదిపంచకంఆకాశస్యశరాః ధనిష్ఠాదిపంచకం- ఏవంచసతిఏకస్యదంపత్యోరన్యతరస్య- ఉడునక్షత్రజాతేఆర్ద్రాదిషట్కభవేత్ అపర

భంఅపరస్య భయోరన్యతరస్య నక్షత్రంవహన్నుత్తరఫల్గున్యాదిష ట్కభవే
చ్చేత్ తయోః దంపత్యోర్మృతిస్స్యాత్ పరిణయేవివాహవిషయే· అప రేడక్తారిక్తా
శ్చ భాంశయుం భూతాఖ్యోవర్గః॥ అ॥ భూతవగుణ వును జెప్పుచున్నాడు॥ తా॥ ప్రసి
ద్ధంబులగు పృథివ్యప్తేజోవాయ్వాకాశము లనెడు పంచభూతములకునశ్విని మొద
లుకొని నక్షత్రములలో క్రమంబున పృథివికినక్షత్రములు - జలమునకు నక్షత్ర
ములు- తేజస్సునకు నక్షత్రములు- వాయువునకు నక్షత్రములు-ఆకాశమునకు
నక్షత్రములు,నీరీతినివిభజింపగ దంపతులజన్మనక్షత్రములలోనొకనక్షత్రము
లు తేజోనక్షత్రముగనుండి మఱియొకనక్షత్రముజలభూతనక్షత్రముగనుండినేని
మృత్యుప్రదంబగునట్లుగాకున్నశుభఫలరంబగునని టు॥ *

(౧౩౬) మూ॥ ఇంద్రాగ్నియమఅసురశ్చవరుణోవాయుఃకుబేరశ్శివః
గాదిప్రభవోదినాదితియోస్స్యేకైకశష్షోడశ। నాసత్యాదికమేకమేకముడుతచ్చి
ష్టత్రయంపూర్వవత్పూర్వాద్యష్ట భగాశ్చకేతురహితాః ప్రాదిషస్థాపితాః॥
వ్యా॥అ॥అథ ద్వాభ్యాంశ్లోకాభ్యాంచంద్రయోగవర్గమాహ॥ ఇంద్రాగ్నీః। ఇంద్ర
శ్చఇంద్రాగ్నియమః ప్రసిద్ధః ఆసురోనిర్ఋతిః-వరుణః-వాయుఃకుబేరఃశివఃఇత్య
ష్టావేతేప్రాగాదిప్రభవః ప్రాగాద్యష్టదిశామధిపతయః ఏవందినాదితిథయఃది
నాదిః ప్రతిపత్ సైవాదిర్యేషాంతేతథోక్తాఃతనాదయష్షోడశతిథయఃతేష్వేకైక
శఃఏకైకదినంఏకైకస్యాంప్రాచ్యాం దిశిక్రమేధద్విరావృత్త్యాస్థాప్యంఏవంనాస
త్యాదికంనాసత్యావశ్వినీసైవఆదిర్యస్యతత్తథోక్తం॥ని॥నాసత్యావశ్వినావథప్రా
వాశ్వినేయాచతావుభావిత్యమరః ఏకైకముడునక్షత్రం చప్రాగాద్యష్టదిక్షుక్ర
మేణత్రిరావృత్త్యాస్థాప్యంతదాచతుర్వింశతి గ్భవతితచ్ఛిష్టత్రయంతేషాం నక్ష
త్రాణాంశిష్టత్రితయంపూర్వవత్పూర్వాది దిక్షుస్థాప్యం కేతురహితాః కేతుభి
న్నాఅష్టభగాఅష్టగ్రహాప్రాగాదిదిక్షుస్థాపితాఃస్థాపనీయాఇత్యర్థః॥ *

(౧౩౭)మూ॥ దంపత్యోరపిజన్మధిష్ణ్యవశతోజ్ఞాత్వాచతాంతాందిశం
తత్రస్థోడుపతిగ్రహేంద్రతిథిదిజ్నాథారిసామ్యేష్టతామ్। తేషామైత్రవశాచ్చ
మైత్రముభయోస్సామ్యేసమత్వంతథాశత్రుత్వయంయదిశత్రుత్వైనశభృద్యో
గాఖ్యవర్గస్త్వయమ్॥ వ్యా॥ దంపత్యోరితి॥దంపత్యోఃజన్మధిష్ణ్యవశతఃజన్మనక్ష
త్రవశాత్ - తాంతాంపురుషనక్షత్రాధిష్టితాందిశంస్త్రీనక్షత్రాధిష్టితాందిశం
జ్ఞాత్వాతత్రస్థోడుపతిగ్రహేంద్రతిథిదిజ్నాథారి సామ్యేష్టతాంతత్రస్థాడుప
తేఃతద్దిశస్థఃనక్షత్రాధిపతేఃగ్రహేంద్రస్యతిథిదిజ్నాథయోఃతిథినాథోధిక్నాద
శ్చతయోశ్చతేషాంచతుర్ణాం మైత్రవశాత్ మిత్రత్వేసతీత్యర్థః ఉభయోర్దంప
త్యోరపిమైత్రంమిత్రతా - తేషాంసామ్యేదంపత్యోరపి సమత్వంతథాతేషాంశ
త్రుత్వేయది దంపత్యోరపిశత్రుత్వైవ-అయమర్థస్సంపన్నః-పున్నక్షత్రాధిష్టితః

